శ్రీః

# భారతసంస్థానము



భారతీసంప్రదాయసార్వభౌమ

జగద్గురు శ్రీకళ్యాణానందభారతీమహాంతాచార్య

స్వాములవారు.



శ్రీ విద్యాశంకరభవనము,

గర్తపురి.

ఫాల్గునపూర్ణిమా.

1950

 [మూల్యము 8 అణాలు.

శ్రీః

నారాయణ సమారంభాం విద్యాశంకర మధ్యమామ్।
శ్రీబోధానంద పర్యంతాం వందే గురుపరంపరామ్॥

# భారతసంస్థానము

# "The Constitution of India"

## (BHARAT)



భారతీ సంప్రదాయ సార్వభౌమ, జగద్గురు
శ్రీ కల్యాణానంద భారతీమహాంతాచార్యస్వాములవారు.

గర్తపురి.



ఈ కలియుగము నందు అయిదువేల యేఁబది యొకటవ (౫౦౫౧) సంవత్సరమగు విరోధి సంవత్సర మార్గశిర మాసము నందు శుక్ల పక్ష సప్తమీ శనివారమునాఁటికి సరియగు ఇరువది యాఱవదినము నవంబరు 1949 తేదీ యందు భారతసంస్థానమును (The Constitution of India) నొక సంస్థ సంస్థాపనము చేయఁబడి యున్నది పరిషద్వర్గము వారిచే నామోదింపఁబడి యములులోఁ బెట్టఁబడి చేకొనఁబడినట్లు ప్రకటింపఁబడియున్నది. ఈ తద్విషయము తొలిపలుకు (Preamble) నందిట్లు ప్రకటింపఁబడి యున్నది.

# THE CONSTITUTION OF INDIA

We, the people of India, having solemnly resolved to constitute India into a Sovereign Democratic Republic and to secure to all its Citizens:—

Justice, Social, Economic and Political;
Liberty of thought, Expression, Belief, Faith and Worship:

Equality of Status and of Opportunity; and to promote among them all.

Fraternity, assuring the Dignity of the Individual and the Unity of the Nation:

In our constituent Assembly, this Twenty Sixth Day of November, 1949, do hereby Adopt, Enact and give to Ourselves this Constitution.

ఇట్టి తొలిపలుకు (Preamble) తోఁ బ్రారంభమై (Part XXII) ఇరువది రెండవభాగమగు—"Short Title Commencement and Repeals" అను శీర్షికతో నీవిషయము ముగింపఁబడియున్నది.

Short Title—393. This Constitution may be called the Constitution of India. Commencement 394— This article and articles 5, 6, 7, 8, 9, 60, 324, 366, 367, 379, 380, 388, 391, 392, and 393 shall come into force at once, and the remaining provisions of this Constitution shall come into force on the 26 th day of January 1950, wich day is referred to in this Constitution as the Commencement of this Constitution.

Repeals:—395. The India Independence Act 1947; and the government of India Act 1935, together with all enactments amending or supplementing the latter Act, but not including the Abolition of Privy Council Jurisdiction Act 1949, are hereby repealed.

కావున నీ జనవరి యిరువది యాఱవ దినము 1950 కు సరియగు నీ విరోధివత్సర మాఘ శుక్లాష్టమీ గురువాసర మిది వఱకు భీష్మాష్టమి యను పవిత్రదివసముగా నొప్పుచు భారత భూమియందుఁ జిరకాలమునుండియు సర్వవిధముల లుప్తమై మఱపుఁజెందఁబడిన భారతసంస్థానమును హస్తినాపురము (ఢిల్లీ నగరము) రాజధానిగాఁగల్గి నెలకొలుపబడిన పవిత్రదినముగా భారతవర్ష చరిత్రమున నతిశయమును గాంచుచున్నది. భారత వర్షమునకు నిక్కాలమున నింతకంటె మహైశ్వర్యము వేఱొకటి యుండదని భారతీయులెల్లరును సర్వవిధములఁ బరమానందము నందవలసిన విషయమైయున్నదని ప్రత్యేకముగా మేము చెప్ప నక్కఱ లేదు. ప్రకృతమున భారతసంస్థాన భారమును వహించిన మహాశయులు భారతీయులందఱకును భారతవర్షపుఁ దొల్లింటి యతిశయమును సర్వవిధముల జ్ఞాపకముసేయు నత్యద్భుతముగను నతిసంగ్రహముగను నొకమహాకార్యమును జేసియున్నారు. అయ్యది మొట్ట మొదట నందఱచే స్మరింపఁదగిన విశేషమగుటం జేసి మేమీ వ్యాసమునందద్దాని ప్రశంసమును గావించి యభిలషితార్థమును బిమ్మటఁ బ్రదర్శించెదము. అదెద్దియనఁగా:

౧. "The Constitution of India" యను గ్రంథము యొక్క ముఖపత్రమునందు బిందువు, వృత్తముగల్గి ఇరువది

నాలుగు రేఖలతో నలంకరింపఁబడిన వృత్తద్వయ రూపముతో నొప్పునట్టి చక్రవిశేషమును, నద్దాని కిరుపార్శ్వములందును రెండు సింహములతో నలంకరింపఁబడిన పీఠమైన నొక్క మూర్తిమంతముగా నెల్లరకును నప్రతిహతముగఁదోఁచు సింహత్రయముతో నొప్పు చక్రవిశేషమును, నద్దానికి నత్యంత సన్నిహితముగఁ గ్రిందిభాగమున "సత్యమేవ జయతే" యను పరమ పవిత్రమును సకలవేదసారమును సకల వేదశిరోఽవతంసమును నగు మహోపదేశమును బరమపవిత్రముగాఁ బ్రకటించి యున్నారు.

౨. ఇంతవఱకు "ఇండియా – India Hindu హిందు" అను నామముల కలవాటుపడి నైసర్గికమగు 'భారత' యను పవిత్రనామమును మఱచిన సకలప్రజలకును భారతశబ్దము మఱల స్ఫూర్తికి వచ్చునటుల "ఇండియా" యను శబ్దమునకు సమానార్థకముగా భారతశబ్దము శాసింపఁబడియున్నది.

Name and territory of the Union—

1. (i) India, that is Bharat, shall be a Union of States.

3. అధికారభాషకు దేవనాగరి యొక్క పరిలేఖనము ననుసరింపఁబడ వలయుననియు,

Official Language of the Union— 343 (1)—

The Official Language of the Union shall be Hindi in Devanagari Script.

"భావవ్యంజకం రేఖారూపం చక్ర" మ్మను శిష్టస్మృతిచే నెల్ల చక్రములును నద్భుతములగు భావముల స్ఫురింపఁ జేయు నను విశేషముచే నీ చక్రముచే స్ఫురింపఁజేయఁబడు నర్థమును

మేమిచటఁ బ్రదర్శించినదో యనఁగా మేమిచటఁ బ్రదర్శింపఁ దలఁచిన విషయమున కుపచరించునట్టి కాగితముకంటె నధమము నాలుగేళ్లు కాగితమైనను జాలనను గ్రంథవిస్తరభీతిచే నిద్దాని నుండి విరమించి భారతశబ్దముచేఁ దెలియవచ్చెడి యర్థమును మాత్ర మింత సంగ్రహముగా వివరింతుము.

### భారతశబ్దము

భారతశబ్దము భరతశబ్దముతో సంబంధించిన దేశవిశేష మను నర్థమునందు వ్యవహారమును గనుచున్నటుల నీ విష్ణు పురాణ శ్లోకములవలనఁ దెలియవచ్చుచున్నది. అదెద్దియన—

"ఉత్తరం యత్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణమ్
వర్షం తద్భారతం నామ భారతీయత్ర సంతతిః"

ఈ భారత వర్షమునే మను వార్యావర్తమనిగూడ నిర్వచించియున్నాఁడు.

"ఆసముద్రాత్తు వైపూర్వాదాసముద్రాత్తు పశ్చిమాత్
తయోరేవాన్తరంగిర్యోరార్యావర్తం విదుర్బుధాః"

ఆర్యావర్తమన నార్యులు పౌనఃపున్యముగాఁ బుట్టు ప్రదేశమని యర్థము. భారతీ సంతతి యన భారతీ వంశమని యర్థము. ఏ తదరాతిశయమును సూచించు నొకమహాకార్య నిర్వాహణమునకై శ్రీ వేదవ్యాసులను బ్రస్తుతించిన కవిశేఖరుని ఈ పద్యముచే గూడ నీ భారతీ శబ్దార్థము లెస్సగఁ దెలిసికొన నగును.

"ప్రాంశుపయోద నీలతనుభాసితు నుజ్జ్వలదండ ధారుఁ బిం
గాంశు జటచ్ఛటాభరణు నాగమపుంజ పదార్థతత్త్వని
స్సంశయకారుఁ గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
వంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయుఁ గొల్చెదన్."

ఇట్టి భారతీవంశ వివర్ధనుఁడగు శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాక్రమమున సృష్ట్యాదియందు బ్రహ్మయొక్క మూర్తిభావమో యను శ్రీమన్నారాయణునకో బ్రహ్మవర్తమునఁ బ్రారంభమై యాతనిచే భారతవర్షౌన్నత్యమునకై నెలకొలుపఁబడిన భారతీ సంప్రదాయమునఁ బ్రకృత కలిద్వాపరసంధియం దప్రతిహతతేజముతో భారతీవంశమును సహస్రప్రభాభాసమానముగ సంస్థాపనమును గావించిన భారతీ సంస్థానాధీశ్వరుఁడగు భారతీ సంప్రదాయ సార్వభౌముఁడు. ఇట్టి భారతీసంప్రదాయ సార్వభౌమునియొక్క యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాక్రమమున వెలుఁగొందిన కీర్తిశేషులైన భారతీ సంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ బోధానంద భారతీమూంతాచార్య మహాస్వామి కరకమల సంజాతులై యీ భారతభూమియందు భారతీసంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ కల్యాణానంద భారతీమూంతాచార్య స్వామియని యఖండయశమును గాంచుచున్న వారలీ వ్యాసరచయితలని యెల్లవారలకును దెలిసిన విషయమే. ఇవ్వాని ప్రసంగానుప్రసక్తి, ప్రస్తుతము ననుసరింతము.

భారతశబ్దమొక భారతీ సంప్రదాయమనెడి యర్థమాత్రబోధకమేగాక 'భరతు' లను పవిత్రనామముచే సార్థక

తను జెందిన క్షత్త్రప్రభువులచేఁ బరిపాలింపఁబడు దేశమను నర్థవిశేషబోధకముగూడ నగుచున్నదనునది రెండవ విశేషము. ఏతద్విషయమును లెస్సగఁ దెలిసికొనవలయునన్నచో వేదమునందుపదేశింపఁబడిన మహాయాగములలోఁ బవిత్రమగు రాజసూయయాగరహస్య విశేషమును లెస్సగఁ దెలిసికొనవలయును. అట్టి విశేషవిధానము గ్రంథవిస్తరభీతిచే విరమింపఁబడి ప్రధాన విశేషములమాత్రము ప్రదర్శింపఁబడుచున్నది. అదెద్దియన—

భరతశబ్దమొక రాజ్యమనఁగా సంస్థానమును బరిపాలించు రాజన్యునకు వైదికధర్మముచే నలవడు సార్థకమగు బిరుదముగాని యెద్దియో యొకతీరున నెద్దియేని పురుషునకు యదేచ్ఛముగ లభ్యమగునదిగాదు. భరతశబ్దముచే రాజ్యమునకు రాజసూయ యాగపురస్సరముగఁ బట్టాభిషేకము సేయఁబడిన క్షత్త్రియ శ్రేష్ఠుఁడగు సమ్రాట్టను రాజన్యుఁడు గౌరవింపఁబడుట శిష్టాచారసిద్ధమగు మర్యాద.

రాజ్యమునందు రాజపదవి నధిష్ఠింపఁజేయఁబడు క్షత్త్రియపుంగవునిచే వేదవిద్వాంసులగు బ్రాహ్మణులు వేదమునందుఁ బ్రసిద్ధిఁగాంచిన రాజసూయయాగమును గల్పసూత్రకారు లుపదేశించినవిధానమునఁ జేయించి యట్టియాగమునందు యజమానుఁడగు రాజన్యుని నాసంది యను పవిత్రపీఠమునఁ గూర్చుండఁబెట్టి యధ్వర్యునిఁ బురస్కరించి ఋత్విక్కులందరును సమంత్రకముగ సామ్రాజ్యాభిషేకమును గావింపుదురు. అట్టి సామ్రాజ్యాభిషేకముచే మూర్ధాభిషిక్తుఁడగు క్షత్త్రియ పుంగవుఁడే రాజ్యమను సంస్థానమును బరిపాలించుటకు శ్రుతిస్మృతి

సదాచారములచేఁ బ్రతిపాదింపఁబడు నధికారి. ఇట్టియధికారము నభిషేకపురస్సరంబుగ సంక్రమింపఁజేసిన యధ్వర్యుఁడచట సమావేశమైయున్న క్షత్త్రియులను వైశ్యులను శూద్రులను ద్విజసములను శూద్రసములను నుద్దేశించి సింహాగర్జనముతో నిట్లు వైదికమంత్రములను బలుకును.

"ఏష వోఽభరతా రాజా, అస్మాకం బ్రాహ్మణానాం సోమో రాజా" యని. ఈ మంత్రాభిప్రాయ మెట్టిదనన్- ఏషః = ఈ ప్రకృతమున సామ్రాజ్యాభిషేకము సేయఁబడుటచే మీ యెదుట నాచేఁ బ్రదర్శింపఁబడు, భరతః = భరతుఁడను నామాలంకృతుఁడు, వః = మీకు ననఁగా బ్రాహ్మణేతరులగు సకలప్రజలకును, రాజా = ప్రభువు, పరిపాలకుఁడు, బ్రాహ్మణేతరులన నటనుండ నర్హులగు క్షత్త్రియులు వైశ్యులు శూద్రులు ద్విజసములు శూద్రసములనను తరగతులకుఁ జెందియున్నవారలని యర్థము ఇఁక బ్రాహ్మణులకన్ననో "అస్మాకం బ్రాహ్మణానాం = బ్రాహ్మణులమగు మాకందఱికిని, సోమో రాజా = ఆకసమునఁ దెలియవచ్చెడి, సోముఁడనఁగాఁ జంద్రుఁడు, రాజా = ప్రభువు. అనఁగాఁ బరిపాలకుఁడు. అనఁగా నీ పృథివియందు బ్రాహ్మణులపై నధికారమును సాగించుటకు బ్రాహ్మణేతరుని కెవ్వని కైనను నధికారమించుకేనియు లేదని తాత్పర్యము.

ఇట్లు రాజసూయయాగముచే మూర్ధాభిషిక్తులగు క్షత్త్రియపుంగవులచేఁ బరిపాలనము సేయఁబడునది గావున భారతవర్షమని సార్థకనామము. ఇట్టి యతిశయము సకలజనులకును దెలుగస్ఫూర్తికిఁ దెచ్చుటకై యీనామమాశ్రయింపఁబడినట్లు కోవిదులు సుకరముగ గ్రహింపఁగలరు.

ఇంక దేవనాగరాక్షరములను శాసించుట యందుఁ బ్రపంచమున నేరికిని నైసర్గికముగాక భారతీయులకు మాత్రము సృష్ట్యాదినుండియు భారతవర్షంబునఁ బవిత్రతమముగాఁ దలంపఁబడుచుండిన గీర్వాణభాష (సంస్కృతము)ను భారతీయులందఱకును దృష్టిపథమున నుంచుటయే పరమతాత్పర్యమని ప్రాజ్ఞులూహింపఁగలరు. ఏదియెట్లులైనను ప్రకృతమున భారత సంస్థానము నెలకొలుపఁబడినది. సంస్థాన పరిపాలనమునకుఁ దగుమర్యాదలన్నియు విపులముగ ముచ్చటింపఁబడి సకల ప్రజలకును సుకరముగఁ బరిపాలనా విధానమంతయుఁ గరతలామలకముగాఁగ విధాన మాంగ్లభాషయందచ్చొత్తింపఁబడి నలువదివేల గ్రంథములు ప్రకటింపఁబడినవి. అందొక ప్రతి 26-1-1950 తేది యుదయమునఁ బదిగంటల పదినిముసములకు శ్రీపాదసన్నిధికిఁ జేరినది. మేమద్దాని నామూలాగ్రముగఁ దిలకించితిమి. ఆనందము పొంగినది. క్రమక్రమముగా నద్దానిపై నొకింత యాలోచించితిమి. మా యానందము పరమానందమయ్యెను. ఏలయన నద్దానియందుఁ దెలియవచ్చెడి స్వీయాతిశయవిశేషమే యందులకుఁ గారణము. అదెద్దియన మేము 22-8-1907 తేది గురువాసరము భారతీసంప్రదాయ సార్వభౌమ జగద్గురు శ్రీ బోధానంద భారతీమాంతాచార్య మహాస్వాముల వారివలన భారతవర్షీయ జగద్గురుత్వమునకు నిర్దేశింపఁబడిన నాఁటంగోలె 23-12-1923 తేది యాదివాసరము వఱకు నట్టి యధికారమును నిగూఢముగా (Latent) గలిగియుండి నాఁటి సాయంకాలమున నా మహర్షులయొక్క కరకమలకృతాభిషేకముచే నట్టియధికారమును మేము సర్వవిధముల నేఁటివరకు

నప్రతిహతతేజముతో నీ భారతవర్షమునఁ గలిగియున్నారము. అట్టి యధికార మాసేతుశీతనగ మధ్యవర్తియగు భారతవర్షము నందలి చాతుర్వర్ణ్యమునందుఁ బ్రసరించియున్నది. ఇట్టి యధికారము సృష్ట్యాదినుండియు భారతవర్షమున ననాదిస్థితిచెన్న గురుపరంపరా ప్రాప్తమగు భారతీ సంప్రదాయమున శ్రుతి స్మృతి సదాచారసరణి మూర్ధాభిషిక్తుల మగుటచే మాకు లభించినది. ఏతదధికార ప్రతిపాదకము మనుస్మృతి పదవ యధ్యాయమున మూఁడవశ్లోక మిటు ప్రదర్శింపఁబడుచున్నది.

"వైశేష్యాత్ప్రకృతి శ్రైష్ఠ్యాన్నియ మస్యచధారణాత్
సంస్కారస్య విశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః"

ఇఁక భారతసంస్థానమును (Indian Constitution) జూడఁ బ్రకృతమున భారతీవర్షీయ పరిపాలనమునందు సర్వస్వాతంత్ర్యమునుగల యొక భాగస్వామిగ (Citizen) నే మధికారమును గలిగియున్నారము. అందుచే నట్టి భాగస్వాములమైన మాయందు దేశకాలపరిస్థితులచే నైననేమి యవకాశముచే నైననేమి సర్వవిధముల మూర్తీభవించుటకు నవకాశముగల సర్వాధ్యక్షాధికారము (Presidentship) సర్వవిధముల నిగూఢముగ (Latent) నుండుటచేతను మాయొక్క యతిశయము భారతభూమియందు నిరతిశయత్వమును బొందినది. అట్టి నిరతిశయాధికారమును బ్రకృతము మాయందు నిగూఢముగా నిబిడీకృతమైయున్నదానిని సర్వవిధములఁ బరికింప మేము పరమానందభరితులమైతిమి. ఇట్టి పరమానందముతోడనే ప్రకృతమున భారతసంస్థానము దుర్దశలో మునిఁగియున్న భారత

వర్షమును వాల్లింటి గౌరవము నొందించి చతుస్సాగరపరి వేష్టితం బగు నీభూమండలమునఁ దెలియవచ్చెడి సంస్థానములలో నగ్రగణ్యముగా మూర్తీభవింపఁజేయు భారతీయులు మఱచి నట్టియు భారతసంస్థాన మవశ్యమాచరింపవలసినట్టియు విశేష విషయములనుగూర్చి శ్రుతిస్మృతిసదాచార ప్రమాణాను ప్రాణితములగువానిని సంక్షేపముగఁ బ్రదర్శించెదము. కావున భారత వర్ష పరిపాలనాస్వాతంత్ర్యమును దెలిసికొనిన ప్రాజ్ఞులగు నరులు (Citizens) ప్రయోజనమును గనియెదరుగాక !

## — భారత సంస్థానము —

ప్రకృతకాలమున స్వతంత్ర దేశములను బరిశీలించినను ప్రాచీన చరిత్రములను బరిశీలించినను నొక్కొక్క దేశవిశేష మొక్కొక్క సంస్థానవిశేషముచేఁ బరిపాలింపఁబడుచుండుటను మనము దెలిసికొనుచున్నాము. ఎట్టి సంస్థానవిశేష మొప్పు పరఁగుచున్నను నయ్యది యొక ప్రాజ్ఞోత్తముని బుద్ధివిశేషముచేఁ గాని కొందరు ప్రాజ్ఞులు తమ బుద్ధివిశేషములచేఁగాని యోజించి యొకసమయముగా నిర్దేశించిన విధానమున వ్యవహారమును గనుచున్నట్లు దెలియవచ్చుచున్నది. ఒక పురుషుని బుద్ధిచే నొకసంస్థానము నెలకొలుపఁబడుఁగాక ! అట్టి సంస్థానమెద్దియో యొకమహాప్రయోజనము నాదర్శముగాఁ బెట్టుకొని ప్రవర్తింపఁ జేయఁబడిన సంస్థానములుగానే యలరారుచుండును. అట్టి యాదర్శ మా దేశప్రజలచేఁ బవిత్రతమంబగు శిరోఽవతంస ముగ దలంపఁబడి నద్దాని నీడేర్చికొన నెల్లరును బ్రవర్తించు చుందురు. ప్రవర్తింపఁజేయఁబడుచుండురుగూడ. ఏలయన

"ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" యను న్యాయము సర్వలోక సంసిద్ధమేగదా! అట్టి స్థితియందు సంస్థాపనము నిష్ప్రయోజనముగాఁ బ్రవర్తించుచున్నచో నయ్యది ప్రాజ్ఞుల కెంతమాత్రము విశ్వసనీయము గా నేరదు. దేశాన్తరములందు సంస్థానము లా దేశీయులచే మనోహరంబులుగాఁ దలంపఁబడుచుండ మన భారతీయులకు నట్టిపరిజ్ఞానమును నానందమును నున్న యట్లుగఁ దెలియరాకున్నది. ఇట్టి పరిజ్ఞాన శూన్యతకుఁ గారణమేమనగా.

సుమారొక వేయిసంవత్సరములనుండియు దస్యులు తమ తమ దేశములందు జీవికను గానలేక యార్యావర్తమనెడి యీ భారతవర్షమునందుఁ దమ జీవికకు ననుకూలములగు విశేషములను గనిపెట్టి యీ యార్యావర్తమునకు రాకపోకలను సాగించుచుఁ గ్రమక్రమముగా నార్యావర్తప్రజలను దమ దౌర్జన్యమునకు వశముచేసికొని వారలయందు నధికారవ్యాజమున స్థానములను గల్పించుకొని ప్రజలను భయపెట్టుచు మోసపుచ్చి తమ కార్యములను సాగించుకొనుచుండిరి. ఆర్యావర్తమునందుఁ సృష్ట్యాదినుండి నేటివరకుఁ గడు నతిశయముతో నొప్పు రెండు ప్రాణివిశేషములు గలవు. అవెవ్వియన__ ద్విపాత్తులలో బ్రాహ్మణులు, చతుష్పాత్తులలో గోవులును. ఈ రెండు జాతులును జాత్యంతరములకంటె సృష్టియం దెంత యతిశయముతో నొప్పుచున్నవో యంతటి భయముతోఁగూడ గ్రస్తములైయున్నవి. చతుష్పాత్తులలోఁ బవటియందు లోకమునఁ జరించుటకుఁ దగు సామర్థ్యములేక సర్వవిధముల బారియులలోఁ దాగియుండు నక్కసయితము గోవును సుకరముగ

పోషించుటకుఁ దగు సామర్థ్యమును గలిగియుండుట చేతనే యయ్య
ది 'గోమాత' యను సార్థకనామమును బడసియున్నది. ఇఁక
బ్రాహ్మణులన్ననో దుష్టులై దుష్కృతులకు సంశయింపని యెట్టి
ద్విపాత్తులైనను జూచి నిస్సంశయముగ వెనుకంజవేసి యేమాఱు
మూలలనైన దాఁగి "బ్రతికితిమిరా" యని యించుకంత ధైర్యమును
దెచ్చికొని చాటుచాటుగా బ్రదుకుచుండును. చతుష్పాత్తులగు
గోవులును, ద్విపాత్తులగు బ్రాహ్మణులును భారతవర్ష మూన్న
త్యమని శ్రుతిస్మృతిపురాణేతిహాసములు సర్వవిధముల ఘోషిం
చుచున్నవి. భారతవర్షమునందు జీవికకు వచ్చిన దస్యులలో
నగ్రగణ్యులన్ననో సర్వవిధముల శ్రుతిస్మృతిపురాణేతిహాస
విరోధకులును, గోమాంసభక్షకులును, బ్రాహ్మణఘాతకులును.
బ్రాహ్మణులన్ననో సృష్ట్యాదినుండియు క్షత్రియులను దమకు
సర్వవిధముల రక్షకులుగా నెలకొలుపుకొని సుఖంబుగా మనియు
చుండెడివారలు. అట్టి క్షత్రియులన్ననో దుర్గతివశమున దస్యు
లకు దాసులగుట యటుండ సర్వవిధముల దస్యుసదృశులైయిరి.
దస్యుల ననుకరింపసాగిరి. పరికించిచూడ నామమాత్రావశేషు
లైరి. దాసంజేసి తాము రక్షించుచుండిన బ్రాహ్మణ దేశమునంతను
దస్యులపాలు సేసిరి. దస్యులు దౌర్జన్యముచేనైననేమి మాయో
పాయములచేనైననేమి భారతీయుల నెన్ని విధముల వంచింపవల
యునో యన్ని విధముల వంచించిరి. భారతీయులందఱు స్వీయము
లగు వర్ణము జాతి కులము గోత్రము మతము భాష యాచారము
వ్యవహారము మొదలుగాఁ గల్గిన విశేషముల నన్నింటిని మఱచి
యాహార నిద్రా భయ మైథునములనే ప్రధానములనుగాఁ గల్గి
ప్రవృత్తిష్ఠ మీఱి దస్యులయొక్క వేషభాషావ్యవహారంబులనే

యతిశయమునుగాఁ దలంచుచుఁ జతుష్పాత్తులకంటె నికృష్ట భావమును బొందియున్నారనుటకు నీ శిష్టోక్తి యొకటియే చాలును.

"ఆహారనిద్రాభయమైథునాని సామాన్యమేతత్పశుభిర్నరాణాం।
జ్ఞానం హి తేషా మధికో విశేషో జ్ఞానేనహీనః పశుభిస్సమాన॥

ప్రకృతవిశేషము:— ఏది యెట్లులైనను భారతవర్ష మొకింత దస్యుల దాడినుండి విముక్తిని బొంది దన్ను దాను గాపాడుకొనుచుఁ దన తొల్లింటి యౌన్నత్యమును బడయుటకుఁ దగు సావకాశము గలుగ 26-1-1950 తేది గురువాసరము భారతభూమియందొక స్వాతంత్ర్యపూరితమగు సంస్థానముపక్రమింపఁబడి వ్యవహారమును గనుచున్నది. ఇట్టి సంస్థానము భారతవర్షమున నొక యపూర్వవిశేషమని ప్రాజ్ఞులు దెలిసికొనుచున్నారలు. ఈ సంస్థాన మపూర్వమయ్యును బూర్వము భారతవర్షమున సంస్థానముగాని, సంస్థానములుగాని లేకపోలేదు. అట్టిసంస్థానములు భారతవర్షమున నెట్లు బయల్వెడలెను? ఎట్లు పరిణమించెను? అట్టి సంస్థానవిశేషముల యాదర్శ మెద్ది? యను విశేషముల నొకింత మాయొక్క బాధ్యతమెయిఁ బ్రదర్శించుచున్నారము.

పరికించిచూడ సంస్థానమనునది సకల దేశములును బుట్టకపూర్వమేయన సృష్ట్యాదియందే భారతవర్షమునఁ గేవలము పరమేశ్వరునిచే నెలకొలుపఁబడి తద్ధర్మవిశేషములు పరమేశ్వరుని చేతనే యుపదేశింపఁబడినవి. అట్టి పరమేశ్వరోపదేశమే మనుధర్మశాస్త్రము, భృగుసంహిత, మనుస్మృతి

యను సార్థక నామములచే నఖిల భారతీయులకును దెలిసియున్న విశేషమే. అట్టి పవిత్రతమంబగు గ్రంథరాజము నాధారముగాఁ జేసికొని యీావద్విశేషములును ప్రదర్శింపఁబడుచున్నవి.

— మనుధర్మశాస్త్రము —

మనుధర్మశాస్త్రమునందుఁ బ్రప్రథమమున నిట్లు ప్రదర్శింపఁబడియున్నది.

"మనుమేకాగ్రమాసీన మభిగమ్యమహర్షయః
ప్రతిపూజ్య యథాన్యాయ మిదంవచనమబ్రువన్" ౧—౧.
"భగవన్ సర్వవర్ణానాం యథావదనుపూర్వశః
అన్తర ప్రభవాణాంచ ధర్మాన్నో వక్తుమర్హసి" ౧—౨.
"త్వమేకోహ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః
అచింత్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవిత్ప్రభో" ౧—3
స తైః పృష్టస్తథా సమ్యగమితౌజా మహాత్మభిః
ప్రత్యువాచార్చ్య తాన్ సర్వాన్ మహర్షీ ఞ్ఛ్రూయతామితి
నిటఁ జెప్పఁబడిన మనువే శ్రీ కృష్ణభగవానులచే
"ఇమంవివస్వతేయోగం ప్రోక్తవానహమవ్యయమ్
వివస్వాన్ మనవేప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవత్తని"

గీతాశాస్త్రము నందుఁ జెప్పఁబడిన మనువు, సృష్ట్యాదియందుఁ బారంపర్యక్రమమున వచ్చిన మనువులలో నీ వైవస్వతమను వేడవవాఁడు. ఈతని మన్వంతరము ప్రారంభమై యిరువదియేడు మహాయుగములు గడువ నిరువది యొని

మిదవ మహాయుగము నందలి నాలువ యుగమగు కలియుగమున నేఁటికి 2-2-1950 నైదువేల యేఁబది వత్సరముల పది మాసముల పదునైదుదినములు గడచినవి. అట్టి మన్వంతరారంభమున మనువుచే నీ ధర్మశాస్త్రముపదేశింపఁబడినట్లు సకలప్రమాణ సంసిద్ధమగు విషయము.

— ప్రమాణము —

మనువుపదేశించిన ధర్మము స్వకపోలకల్పితమా లేక యెద్దియేని ప్రమాణమాధారముగాఁ గలదియా యను నియ్యది యంతయుఁ బ్రమాణమూలకమేగాని వేరుగాదని యిట్టి ప్రమాణం మిట్లు మనువుచే నిర్వచింపఁబడినది.

'వేదోఽఖిలో ధర్మమూలం స్మృతిశీలే చ తద్విదామ్
ఆచారశ్చైవ సాధూనామాత్మనస్తుష్టిరేవ చ॥ మను. ౨-౬
యః కశ్చిత్కస్యచిద్ధర్మో మనునా పరికీర్తితః
స సర్వోఽభిహితో వేదే సర్వజ్ఞానమయో హి సః ౨-౭.

ఈ శ్లోకములచే మనువుయొక్క సర్వజ్ఞత్వము ఆతనికిఁ గల శ్రుతిస్మృతి సదాచారప్రమాణ జ్ఞానమును నిర్వచింపఁ బడుచున్నది.

మహాత్ములచేఁ బృచ్ఛసేయఁబడిన మనువు ప్రప్రథమమునను బ్రహ్మావర్తమున బ్రహ్మభావముతో మూర్తీభవించిన విశేషమును నట్టి బ్రహ్మకు నారాయణ శబ్దవ్యవహారము చెప్పి యటి నారాయణుఁడగు బ్రహ్మచేసిన సృష్టిక్రమమునంతను

సంక్షేపముగను సవిస్తరముగను జెప్పెను. అందు మనకుఁ ప్రకృతము వర్ణ్యము తెలిసికొనఁబడవలసిన విషయము మాత్రము ప్రదర్శింపఁబడుచున్నది.

"అగ్నివాయురవిభ్యస్తు త్రయం బ్రహ్మసనాతనం ।
దుదోహయజ్ఞసిద్ధ్యర్థ మృగ్యజుస్సామలక్షణమ్ ॥ ౧-౨౩
లోకానాంతువివృద్ధ్యర్థం ముఖబాహూరుపాదతః ।
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రంచ నిరవర్తయత్ ॥

ఏతద్విషయమునే శ్రీకృష్ణభగవానులు—

"సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేనప్రసవిష్యధ్వ మేషవోఽస్త్విష్టకామధుక్ ॥
చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మవిభాగశః" యని
చెప్పియున్నారు.

ఇట్లు చాతుర్వర్ణ్యమును సృజియించి యవ్వారలకు స్వభావప్రభవములగు కర్మలను గల్పించెనని యిట్లు మనువుచే నిర్వచింపఁబడుచున్నది.

"సర్వస్యాస్యతు సర్గస్య గుప్త్యర్థం సమహాద్యుతిః ।
ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్ ॥
అధ్యాపనమధ్యయనం యజనం యాజనంతథా ।
దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్ ॥
ప్రజానాంరక్షణం దానమిజ్యాధ్యయనమేవచ।
విషయేష్వప్రసక్తిశ్చ క్షత్రియస్య సమాసతః ॥ ౧-౮౯

పశూనాం రక్షణం దాన మిజ్యాధ్యయనమేవచ ।
వణిక్పథం కుసీదంచ వైశ్యస్య కృషిమేవచ ॥ ౧-౯౦
ఏకమేవతు శూద్రస్య ప్రభుః కర్మసమాదిశత్ ।
ఏతేషామేవ వర్ణానాం శుశ్రూషామనసూయయా ॥

ఇట్టి ధర్మములను వారివారికిఁ గల్పించెనని చెప్పుటచే నాయాయిగుణములు వారి వారికి నైసర్గికములేయని శ్రీకృష్ణ భగవానులిట్లు నిర్వచించియున్నారు—

"బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాంచ పరంతప ।
కర్మాణిప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః ॥
శమోదమస్తపశ్శౌచం క్షాన్తిరార్జవమేవచ ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మంకర్మ స్వభావజమ్ ॥
శౌర్యంతేజోధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్ ।
దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మస్వభావజమ్ ॥
కృషిగోరక్షవాణిజ్యం వైశ్యకర్మస్వభావజమ్ ।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్ ॥

ఇట్లు నాలుగువర్ణములను సృజియించి వారలకుఁ బ్రత్యేక ప్రత్యేకముగా సామాన్యధర్మములను విశేషధర్మములను నుపదేశించి నాలుగు వర్ణములయందును దరతమ భావమును గమనింప సృష్టివైచిత్ర్యము నందలి తరతమ భావమిట్లు ప్రదర్శింపఁబడుచున్నది—

భూతానాం ప్రాణినః శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః ।
బుద్ధిమత్సునరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః ॥

బ్రాహ్మణేషుచ విద్వాంసో విద్వత్సుకృతబుద్ధయః।
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః॥ ౧-౯౭

ఇట్లు బ్రాహ్మణ క్షత్త్రియ వైశ్యులను మూఁడువర్ణముల వారలకును విశేషధర్మములెట్లు పరగుచున్నను నధ్యయనము యజనము దానమను నీమూఁడును సామాన్య ధర్మములే యగుచున్నవి, అట్టి యీ సామాన్యములగు మూఁడు ధర్మముల నేయేవయసునం దేయేవిధముగ నాచరింపఁబడవలయునో యట్టివిధానమునంతను బ్రహ్మచర్యము గార్హస్థ్యము వానప్రస్థము సంన్యాసమను నామములతోనొప్పు నాలుగాశ్రమములుగ విభజించి యట్టి యాశ్రమములందు నేయే ధర్మముల నెట్లాచరింపవలయునో యద్దానినంతను మనువు విపులముగ రెండు మూఁడు నాలుగైదాఱు సంఖ్యగల యైదధ్యాయములచే నుపదేశించెను. ధర్మమునకెంత ప్రామాణ్యమున్నను నాచరించుటచేఁగల్గు ప్రయోజనము నెంత యుద్ఘోషించినను నాధికారిక పురుషభయములేనిచో నయ్యవి కేవలము శ్రీరంగనీతులుగనే పరఁగుచుఁ బ్రయోజనము నెంతమాత్రము గననేరవు. ఏతదభిప్రాయమిట్లేడవ యధ్యాయమునఁ బ్రదర్శింపఁబడినది—

"సర్వోదండజితో లోకోదుర్లభోహి శుచిర్నరః।
దండస్యహిభయాత్సర్వం జగద్భోగాయకల్పతే"

అరాజకేహిలోకేఽస్మిన్ సర్వతోవిద్రుతేభయాత్।
రక్షార్థమస్య సర్వస్య రాజానమసృజత్ప్రభుః॥

తస్యార్థే సర్వభూతానాం గోప్తారం ధర్మమాత్మజమ్ ।
బ్రహ్మతేజోమయం దండ మసృజత్పూర్వమీశ్వరః ॥
సరాజాపురుషోదండః స నేతా శాసితా చ సః ।
చతుర్ణామాశ్రమాణాంచ ధర్మస్య ప్రతిభూః స్మృతః ॥

సృష్ట్యాదియందు నాలుగువిధములగు ప్రజలను సృజియించి యందు ద్విజాలను సంకేతములో నొప్పు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థసంన్యాసము లను చతుర్విధమగు ధర్మము నుపదేశించి యట్టి ధర్మము నెల్లరును యథోచితవిధి ననుసరించుచు సుఖంబున మనియుం జేయుట క్షత్రియజాతివిశిష్టులగు ప్రజలకు ననగా క్షత్రియ వర్ణమువారికిఁ బరమధర్మముగా శాసించుచు నందులకుఁ దగు సంస్థాన విశేషమును తద్ధర్మములను నేడవయధ్యాయమున నుపదేశించెను.

ఇట్లు రాజధర్మ ప్రకరణమున నేడవయధ్యాయము నందుపదేశింపఁబడిన సంస్థానమర్యాదలలో ననఁగా విధులలోఁ బ్రథమమున భారతసంస్థానము సృష్ట్యాదియందు బ్రహ్మ ప్రజాపతి నారాయణుఁడను పవిత్రనామములచేఁ బ్రసిద్ధముగాఁ దెలియవచ్చెడి స్వాయంభువుఁడను మనువుచే నెలకొలుపఁ బడియెను. ఇట్టి సంస్థానధర్మముచే నాలుమన్వంతరముల కాలము చాతుర్వర్ణ్యము చక్కఁగా నభ్యుచ్ఛ్రయము నొందుచుండినను నేడవ మన్వంతరకాలమునకుఁ జాతుర్వర్ణ్యములో పాటు సర్వప్రభవులను ప్రజావిశేషము భారతవర్షమున నెల్లయెడలను విస్తరింప భారతవర్షమత్యద్భుతమగు ప్రజావైచిత్ర్య

ము౯ నలరారుచుండెను. దానంజేసి భారత సంస్థానమునకు భంగ్యంతరములు గ్రత్యాంతర మొందు దటస్థమయ్యెను. అట్టి విశేషము భారతవర్షమునకు మార్గదర్శకులగు మహాత్ములు తెలిసి కొన మనువును సమీపించి యడిగిన ప్రశ్నమువలన సుకరముగ గ్రహింపనగును.

"భగవ౯ సర్వవర్ణానాం యథావనను పూర్వశః ।
అన్తరప్రభవానాంచ ధర్మాన్నో వక్తుమర్హసి ॥

ఈ ప్రశ్నమునకు సమాధానముగ మనుస్మృతియందలి పదియధ్యాయమంతయు నుపదేశింపఁబడినది.

ఇచటఁ బదవయధ్యాయమునందు విశేషించి యుపదేశింపఁబడిన విశేషమునలన భారతవర్షమునను భారతసంస్థానము నందును రెండవశకము ప్రారంభమైయుండెనని లెస్సగఁ దెలిసి కొనవచ్చును. ఇందలి విశేషమేమన సృష్ట్యాదియందు నెల కొలుపఁబడిన చాతుర్వర్ణ్యమునందు దేశకాలవైపరీత్యములచే నాలుగువర్ణముల ప్రజలకంటె నన్తరప్రభవులను ప్రజాబాహుళ్యముగలుగ నద్దానిని గ్రమముగు పథమునఁబెట్టి భారతవర్షీయౌన్నత్యమునకుఁ బ్రచ్యుతికలుగకుండ మనువును బురస్కరించి మహాత్ములచేఁ జేయఁబడిన వ్యవస్థయే రెండవశకారంభము.

ఇట్టి వ్యవస్థనుజేసి వర్ణములకు నంతరప్రభవులకును ధర్మవ్యవస్థనుజేయ నక్కాలమునందు బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రులు పవిత్రముగ సృష్ట్యాదియందువలెనే యున్నట్లును, వారలిదివరకువలెనే ధర్మము నాచరింపవలయుననియు వర్ణములకును నన్తరప్రభవులకును గలభేదము సువ్యక్తముగాఁగ నీయ

ధ్యాయమునందు మొట్ట మొదటి నాలుగు శ్లోకములును ప్రవర్తించుచున్నవి. అవెట్లనగ.

"అధీయీరంస్త్రయో వర్ణాః స్వకర్మస్థాద్విజాతయః ।
ప్రబ్రూయాద్బ్రాహ్మణ స్త్వేషాం నేతరావితి నిశ్చయః॥ ౧
సర్వేషాం బ్రాహ్మణో విద్యాద్వృత్త్యుపాయాన్ యథావిధి।
ప్రబ్రూయాదితరేభ్యశ్చ స్వయం చైవతథాభవేత్ ॥ ౨
వైశేష్యాత్ప్రకృతి శ్రైష్ఠ్యాన్నియమస్యచ ధారణాత్ ।
సంస్కారస్యవిశేషాచ్చ వర్ణానాం బ్రాహ్మణః ప్రభుః ॥ ౩
బ్రాహ్మణః క్షత్రియో వైశ్యస్త్రయో వర్ణాద్విజాతయః।
చతుర్థఏకజాతిస్తు శూద్రోనాస్తితు పంచమః ॥ ౪

అని సింహావలోకనముచేఁ బూర్వగ్రంథవిషయ మను వాదము సేయఁబడినది.

## — అన్తరప్రభవులు —

ఇఁక నైదవశ్లోకమునుండి యనఁగా.

"సర్వవర్ణేషుతుల్యాసు పత్నీష్వక్షతయోనిషు ।
ఆనులోమ్యేనసంభూతా జాత్యాజ్ఞేయా స్త ఏవతే ॥

యను శ్లోకము మొదలు,

"అనార్యమార్యకర్మాణ మార్యంచా నార్యకర్మిణమ్ ।
సంప్రధార్యా బ్రవీద్ధాతా న సమౌనాసమావితి ॥ యను చెప్పఁబడియెడిన శ్లోకమువరకునుగల యిరువది తొమ్మది శ్లోకములచే నన్తరప్రభవుల విశేషము నుపదేశించి యకాలమున

నాలుగు వర్ణములతోపాటు ముప్పదిరెండు విధములగు వర్ణసంకర ప్రభవులున్నటుల సర్వసామాన్యముగ నిర్వచించి యువర్ణసంకరప్రభవులసంఖ్య యంతటితో ముగియక విపులముగఁ బెరుగుటకు నవకాశమున్నదనియు నట్టి దుష్టవ్యవహారమునకుఁ దావీయకుండ భారతసంస్థానము గాపాడవలయుననియు వర్ణసంకరప్రభవ సంఖ్య పెరుగుటకుఁదగు నవకాశమునిట్లు నిర్వచించియున్నాఁడు.

"ప్రతికూలం వర్తమానా బాహ్యాబాహ్యతరాః పునః ।
హీనాహీనాన్ ప్రసూయన్తే వర్ణాన్ పంచదశైవతు ॥ ౧౦-౩౧

ఇట్లు ప్రజావైచిత్ర్యము పెరుగ నవ్వారల నందరను ద్విజులు ద్విజసములు శూద్రులు శూద్రసములు అస్పృశ్యులను నైదు తరగతులనుగా విభజించి మూఁడువర్ణములవారును నధ్యయన యజనదానములను జక్కన నాచరించునటులను ద్విజసములగు మువ్వురును ద్విజులతోపాటధ్యయన యజన దానముల నాచరింపవచ్చునని యానతిచ్చి శూద్రులను శూద్రసములను శూద్రధర్మము నాచరించునటుల శాసించెను. అస్పృశ్యులన్నచో యెట్టి ధర్మమునకు నెంతమాత్రమును స్పృశ్యులు కాకపోవుటచే నవ్వారలకుఁ బ్రత్యేకముగ వృత్తు లేర్పరుపఁబడి జీవికకుఁదగు వ్యవస్థచేయఁబడినది. ఇయ్యది భారతసంస్థానమునందు రెండవశకము.

## —మూఁడవశకము—

మనువుచేఁ జేయఁబడిన వ్యవస్థ ఈకలికిఁబూర్వము ద్వాపర యుగాంతమువరకు వ్యవహారమునందుండెను. కాని రాష్ట్రీయ

ప్రభువులంఱును మితిమీఱి ధర్మవిప్లవమును గావింపఁగలిద్వాపరసంధియందు భారతవర్షమున ధర్మక్షోభము గలిగెను. అట్టియెడ శ్రీకృష్ణద్వైపాయన వేదవ్యాసభగవానులును శ్రీకృష్ణభగవానులును నవతరించి రాష్ట్రీయ ప్రభువులను బరిమార్చి ధర్మరాజును భరతునిఁగావించి యాతనిని భారతభూమియందు నేకచ్ఛత్రాధిపతిఁగా నెలకొల్పి హస్తినాపురమునఁబట్టాభిషిక్తుఁ జేసిరి. ఇయ్యది ప్రకృత కల్యారంభమునకు ముప్పదియేనిమిది వత్సరములకుఁ బూర్వమని సర్వప్రమాణములు వలుకుచున్నవి ఇయ్యదియె భారతభూమియందుఁ బ్రప్రథమమున నెలకొలుపఁబడిన నేకచ్ఛత్రాధిపత్యము. ఇతఃపూర్వము — సృష్ట్యాది నుండియు భారతవర్షమంతయు చప్పన్న దేశాధీశ్వరులను నేఁబదియాఱుగురు భరతులచేఁ బరిపాలన సేయఁబడుచుండుట వలన భారతవర్షమునాఁ బడుచుండెడిది. ఇట్టి కలిద్వాపర సంధికాలమునకు క్షత్రియులును ద్విజసములును వేదాధ్యయనమునుండియు యజనమునుండియు సర్వవిధములను పతనము చెందిరనియే చెప్పవచ్చును. దానంజేసియె వేదరక్షణము స్థిరీకరణమును గర్తవ్యాంశముగాఁగల శ్రీకృష్ణద్వైపాయన భగవానులు పైల, వైశంపాయన, జైమిని, సుమంతులను నల్వురు శిష్యులతోఁగూడి యకాలమునసుండిన బ్రాహ్మణుల నందరను శాఖలుగా విభజించి వారలచే సాంగముగను సరహస్యముగను వేదశాఖల నధ్యయనము సేయించి భారతవర్షౌన్నత్యమును బునఃప్రతిష్ఠితమును గావించెను. ఇయ్యది భారతసంస్థానమునందు మూఁడవశకము.

## — ప్ర కృ త కా ల ము —

ఇఁకఁ గల్యాదినుండియు నేఁటివరకును వేదసంరక్షా భారమంతయు నొక బ్రాహ్మణుల యందే సర్వవిధములఁ బడినది. బ్రాహ్మణులను సంరక్షించి వేదములను సంరక్షింప వలయునను ప్రభువులు లేకపోవుట యటుండ బ్రహ్మద్వేషముఁ బూని బ్రాహ్మణులను, నట్టి బ్రాహ్మణులచే సంరక్షింపఁబడు చుండెడి విద్యలను నిర్మూలనము గావింపఁజూచిన దస్యులు పరిపాలకులైరి. మతాంతరులు ప్రబలిరి. ఏదియెట్లైనను నేఁటి వరకు భారతవర్షౌన్నత్యమునకు నిదానమగు వేదములును తదంగములగు విద్యావిశేషములును నింకను నిలచియే యున్నవి. అవ్వాని పునరుద్ధరణమునకు నవకాశముగలదు. ఇట్టి తరుణమునఁ బరమేశ్వర విలాసమును మనము గుర్తెఱుఁగఁ జాలము. భారతవర్ష పరిపాలన భారము సకల భారతీయులందును ససాధారణముగ 26-1-50 తేది గురువాసరము ప్రాతఃకాలము కుంభలగ్నమున ననఁగా బది గంటల పది నిముసములకు సంక్రమించినది. భారత సంస్థానము నెలకొలుపఁబడినది. కాని భారతీయులకెనుక,— తొల్లింటి గౌరవమును సంపాదింప నించుకేనియు నెవ్వరేనియు నూహించినట్లు గానరాదు. విన రాదుగూడ. ప్రకృతము భారతసంస్థానము ముఖ్యముగాఁ జేయవలసిన కార్యవిశేషమును మే మిటఁ బ్రదర్శింపు చున్నారము. పరిపాలనా భారమును వహించు భారతీయు లందఱును హర్షింతురుగాక !

— భారతసంస్థానము — కర్తవ్యాంశము —

భారతసంస్థాన రక్షణమునకు నెంతద్రవ్యము నైనను వినియోగముసేసి రెండుసంస్థలు సంపూర్ణముగ నెలకొల్పఁబడి యున్నవి. అయ్యవి రెండును సర్వసంస్థానములచే నెల్లయప్పుడును నెలకొలుపఁబడుచునేయుండును. అవెవ్వియన ౧. సైనిక దళములు ౨. రక్షకభటదళములును. అందురక్షకభటదళమునకు నెల్లయప్పుడును సకల వ్యవహారముల యందును సర్వవిధముల నవసరము గలుగుచునేయుండును. అందులకుఁ దగువ్యయమున నెప్పటికప్పుడు ప్రయోజన మగపడుచుండును. కాని సైనికదళ ప్రయోజనమట్టిదిగాదు. ఎప్పుడో యొకప్పుడు తాత్కాలిక ప్రయోజనముండును. అవసరముకొలఁది యద్దానిని సమ కూర్చుట దుర్ఘటముగావున నద్దానితోఁ బ్రయోజనమున్నను లేకపోయినను సంస్థానరక్షణము కొరకయ్యది సర్వకాల సర్వావస్థలయందును నెలకొలుపఁబడియే యుండవలయును. అద్దానివ్యయమునకుఁగూడ నొకప్పుడు మితియుండదు. పరికించి చూడ నీరెండు నిర్మాణములును (౧ సైనికదళములు, ౨ రక్షక భటదళములును) సంస్థాన రక్షణమునకు నత్యవసరములే ఇఁక భారతవర్షౌన్నత్యమే పృథివియం దెల్లపుడును నిలచియుండ వలయునన్నచోఁ బైరెండు నిర్మాణముల కంటెను వేరొక నిర్మాణ మత్యవసరమై యున్నది.

ఇంతవరకు మేము వివరించిన విషయమును దిలకించిన వారలకయ్యది యేదియో సుబోధము కాఁగలదు. ఏలయన

భారతవర్షౌన్నత్యమంతయు వేదవేదాంగముల స్థిరీకరణముపై సర్వవిధముల నిలచియున్నటుల సృష్ట్యాదినుండి నేఁటివరకు భారతీయులలో నగ్రగణ్యులై దలఁచుచు స్వర్గానికొరకుఁ దమ జీవితముల ధారవోసిన ఋషులను దెలిసియేయున్నారు. ఒకానొకప్పుడు హఠాత్తుగా రక్షకభటదళములను సైనికదళములను సమకూర్పవలయునన్న నొక్కనిముసములో సమకూర్పవచ్చును గాని వేదవేదాంగ విద్వాంసులగు బ్రాహ్మణులను మాత్రము సంపాదించుట యెంతకేనియు సాధ్యముకాదు. వేదవేదాంగముల నభ్యసింపఁజేయవలయునన్న యథోచితశక్తి సామర్థ్యములుగల బ్రాహ్మణులచేతనే యభ్యసింపఁజేయవలయును. కావున భారతసంస్థానము భారతవర్షౌన్నత్య సంస్థాపనమునకై యథోచితశక్తి సామర్థ్యములుగల బ్రాహ్మణుల నొకనిర్మాణముగా నేర్పరచి యట్టినిర్మాణము నిరంతరము వంశపారంపర్యముగ వేదవేదాంగములఁ బఠించుచుండునట్లు దగు నేర్పాటులను సంపూర్ణముగఁ జేయవలయును. అట్టి యొకనిర్మాణమును గావించి యద్దానిచేఁ బుష్కలమగు ఫలమును భారతవర్షమునకుఁ గావించినపుడే భారతసంస్థానమును జేకొనిన "Soverign Democratic Republic" సర్వలోకములందును మన్నన వడయుటయగాక యీ భూమండలమున నాచంద్రతారకమగు యశమును బడయఁగలదు. లేనిచో భారతభూమియొక్క యౌన్నత్యమును దిగనాడి యిహపరముల రెండిటికిని భ్రంశమును జెందుదురు. అట్టి నిర్మాణమున చిరకాలములో నెలకొల్పుటకు భారతసంస్థాన ముద్యమించెనేని యందులకుఁ దగు

కార్యక్రమము నుపదేశింప మేము సర్వవిధముల సంసిద్ధముగ నున్నారము.

అభిజ్ఞులకింతో ఽధికము తెలుపనవసరము లేదు.

ఇతి నారాయణస్మృతిః.

[illegible]

విద్యాశంకర భవనము.

౯—౨—౧౯౫౦



కస్తూరిబా ప్రెస్, గుంటూరు.

శ్రీః

# సత్యమేవ జయతే



## సత్యరథః



1. అథాత స్సత్యరథం వ్యాఖ్యాస్యామః
2. సత్యరథస్స్యైవ ధర్మరథో దేవరథో బ్రహ్మరథ ఇతి విజ్ఞాయతే।
3. అరాఇవ రథనాభౌ ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్ । ఋచో యజూంగ్ షి సామాని యజ్ఞః క్షత్రం బ్రహ్మాచ తస్యైవ వ్యాఖ్యానమ్ ।
4. తద్ధి బిందుద్వయ చతుర్వింశతి రేఖా వృత్తద్వయ చక్రరూపమ్ ।
5. తత్ర పరిధి ద్వయంతు మాయాశక్తి స్సదాశివా ।
6. బిందుద్వయం తూపనిషత్ ।
7. బిందుద్వయ పరిధిద్వయయోర్మధ్య ఏవ వ్యాప్తిః ఇతి విజ్ఞాయతే ।
8. తత్రాధ్యస్తా చతుర్వింశతి రేఖా కలాఽపి సదాశివా ।

9. తస్మిన్న మధ్యస్థానం సదాశివమండలమితి సంకీర్త్యతే ।

10. సైవ కలా సత్యకలే త్యపిచ ।

11. సర్వేషామ ప్యాస్థానం సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మేతి శ్రూయతే ।

12. తస్యోపరిష దహరిత్యాహామితిచ వాజసనేయిన స్సమా మనన్తి ।

13. ఓమిత్యేతదితి సర్వే వేదా స్సర్వాణి తపాంసి చ ।

14. సఐక్షత బహూస్యాం ప్రజాయేయేతి ।

15. చతుర్వింశతి రేఖాకలాఽభవత్ ।

16. సైవ చతుర్వింశత్యక్షరా గాయత్రీతి విజ్ఞాయతే ।

17. అత్ర కలా సదాశివా పరిధిస్సదాశివో మండలం సదాశివం బింబస్సదాశివోఽత స్సర్వం సదాశివ మితి విజ్ఞాయతే ।

18. అతస్సర్వం ఖల్విదం సత్యం సదాశివం బ్రహ్మైవ ।

19. తద్విజ్ఞానాదేవ తు పురుషార్థసిద్ధిః పురుషార్థసిద్ధిః ॥

ఇతి నారాయణ స్మృతిః